శ్రీ ర స్తు



# సు మ తి శ త క ము

క॥ శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు ♦ నౌరా యనఁగా
ధారాళమైన నీతులు
నోరూరఁగఁ జవులుపుట్ట ♦ నుడివెద సుమతీ. 1

క॥ అక్కఱకు రానిచుట్టము
మ్రొక్కిన వరమీనివేల్పు ♦ మోహరమునఁ దా
నెక్కినఁ బాఱనిగుఱ్ఱము
గ్రక్కున విడువంగవలయుఁ ♦ గదరా సుమతీ. 2

క॥ అడిగిన జీతం బియ్యని
మిడిమేలఁపుదొరను గొల్చి ♦ మిడుకుటకంటెన్
వడిఁగల యెద్దులఁ గట్టుక
మడిదున్నుక బ్రతుకవచ్చు ♦ మహిలో సుమతీ. 3

క॥ అడియాసఁ గొలువుఁ గొలువకు
గుడిమణియము సేయఁబోకు • కుజనులతోడన్
విడువక కూరిమి సేయకు
మడవినిఁ దోడరయ కొంటి•నరుగకు సుమతీ. 4

క॥ అధరము గదలియుఁ గదలక
మధురములగు భాషలుడిగి • మౌనవ్రతుఁడౌ
అధికారరోగపూరిత
బధిరాంధకశవముఁ జూడఁ • బాపము సుమతీ. 5

క॥ అప్పుఁగొని చేయు విభవము
ముప్పునఁ బ్రాయంపుటాలు • మూర్ఖుని తపమున్
దప్పరయగు నృపురాజ్యము
దెప్పరమై మీఁదఁ గీడుఁ • దెచ్చుర సుమతీ. 6

క॥ అప్పిచ్చువాఁడు, వైద్యుఁడు
నెప్పుడు నెడతెగక పాఱు• నేఱును, ద్విజుఁడున్
జొప్పడిన యూర నుండుము
చొప్పడ కున్నట్టి యూరు • సొరకుము సుమతీ. 7

క॥ అల్లునిమంచితనంబును
గొల్లనిసాహిత్యవిద్య • కోమలినిజమున్
బొల్లున దంచిన బియ్యము
దెల్లని కాకులును లేవు • తెలియుము సుమతీ. 8

క॥ ఆఁకొన్నకూడె యమృతము
తాఁకొంచక నిచ్చువాఁడె • దాత ధరిత్రిన్

సోఁ కోర్చువాఁడె మనుజుఁడు
తేఁకువఁగలవాఁడె వంశ • తిలకుఁడు సుమతీ. 9

క॥ ఆఁకలి యుడుగని కడుపును
వేఁకటి యగు లంజపడుపు • విడువని బ్రతుకున్
బ్రాకొన్న నూతియుదకము
మేఁకలపాడియును రోఁత • మేదిని సుమతీ. 10

క॥ ఇచ్చునదె విద్య, రణమునఁ
జొచ్చునదే మగతనంబు, • సుకవీశ్వరులన్
మెచ్చునదె నేర్పు, వాదుకు
వచ్చునదే కీడు సుమ్ము • వసుధను సుమతీ. 11

క॥ ఇమ్మగుఁ జదువనినోరును
నమ్మా యని పిలిచి యన్న • మడుగని నోరున్
దమ్ములఁ బిలువని నోరును
గుమ్మరి మనుద్రవ్వినట్టి • గుంటర సుమతీ. 12

క॥ ఉడు ముండదె నూఱేండ్లును
బడియుండదె పేర్మిపాము • పదినూఱేండ్లున్
మడువునఁ గొక్కెర యుండదె
కడు నిలఁ బురుషార్థపరుఁడు • గావలె సుమతీ. 13

క॥ ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁ గలుగనేర్చు • నెయ్యెడలం దా
నెత్తిచ్చి కరఁగిపోసిన
నిత్తడి బంగారమగునె • యిలలో సుమతీ. 14

క॥ ఉదకము ద్రావెడు హయమును
మదమున నుప్పొంగుచుండు ♦ మత్తేభంబున్
మొదవుకడ నున్న వృషభముఁ
జదువని యాసీచు దరియఁ ♦ జనకుర సుమతీ. 15

క॥ ఉపకారికి నుపకారము
విపరీతము కాదు సేయ ; ♦ వివరింపంగా
నపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాఁడు ♦ నేర్పరి సుమతీ. 16

క॥ ఉపమింప మొదలు తియ్యన
కపటం బెడనెడను జెఱకు♦కై వడినే పో
నెపములు వెదకును గడపటఁ
గపటఁపుదుర్జాతిపొందు ♦ గదరా సుమతీ. 17

క॥ ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కా మాటలాడి ♦ యన్యుల మనముల్
నొప్పింపక తా నొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ♦ ధన్యుఁడు సుమతీ. 18

క॥ ఎప్పుడుఁ దప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁగూడ ♦ దది యెట్లన్నన్
సర్పంబు పడగనీడను
గప్ప వసించిన విధంబు ♦ గదరా సుమతీ. 19

క॥ ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తు ♦ రది యెట్లన్నన్

చెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పదివేలుచేరుఁ • గదరా సుమతీ. 20

క॥ ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల • దోషము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువు నాజ్ఞ • మేదిని సుమతీ. 21

క॥ ఒకయూరికి నొక కరణము
నొకతీర్పరి యైనఁ గాక • నొగిఁ దఱచైనన్
గకవికలు గాకయుండునె
సకలంబును గొట్టువడక • సహజము సుమతీ. 22

క॥ ఒల్లనిసతి నొల్లనిపతి
నొల్లనిచెలికాని విడువ • నొల్లనివాఁడే
గొల్లండు కాక ధరలో
గొల్లండును గొల్లఁడౌనె • గుణమున సుమతీ. 23

క॥ ఓడల బండ్లును వచ్చును
ఓడలు నాబండ్లమీఁద • నొప్పుగ వచ్చున్
ఓడలు బండ్లును వలెనే
వాడంబడుఁ గలిమి లేమి • వసుధను సుమతీ. 24

క॥ కడు బలవంతుండైనను
బుడమిని బ్రాయంపుటాలిఁ • బుట్టినయింటన్
దడ వుండనిచ్చెనేనియుఁ
బడుపుగ నంగడికిఁ దానె • పంపుట సుమతీ. 25

క॥ కనకపుసింహాసనమున
శునకముఁ గూర్చుండఁబెట్టి ♦ శుభలగ్నమునన్
దొనరఁగఁ బట్టముఁగట్టిన
వెనుకటి గుణ మేల మాను ♦ వినురా సుమతీ. 26

క॥ కప్పకు నొరగాలైనను
సర్పమునకు రోగమైన ♦ సతి తులువైనన్
ముప్పున దరిద్రుఁడైనను
దప్పదు మఱి దుఃఖమగుట ♦ తథ్యము సుమతీ. 27

క॥ కమలములు నీటిఁ బాసినఁ
గమలాప్తుని రశ్మిసోకి ♦ కమలినభంగిన్
దమతమనెలవులఁ దప్పినఁ
దమమిత్రులు శత్రులౌట ♦ తథ్యము సుమతీ. 28

క॥ కరణముఁ గరణము నమ్మిన
మరణాంతక మౌనుగాని ♦ మనలేఁడు సుమీ
కరణము దనసరికరణము
మఱి నమ్మక మర్మమీక ♦ మనవలె సుమతీ. 29

క॥ కరణముల ననుసరింపక
విరసంబునఁ దిన్నతిండి ♦ వికటించుఁ జుమీ
యిరుసునఁ గందెనఁ బెట్టక
పరమేశ్వరు బండియైనఁ ♦ బాఱదు సుమతీ. 30

క॥ కరణము సాధై యున్నను,
గరి మద ముడిగినను, బాము ♦ కఱవక యున్నన్

ధరఁ దేలు మీటకున్నను
గర మరుదుగ లెక్కఁగొనరు ♦ గదరా సుమతీ. 31

క॥ కసుగాయఁ గఱచిచూచిన
మసలక తన యొగరుగాక ♦ మధురం బగునా?
పసగలుగు యువతు లుండఁగఁ
బసిబాలలఁ బొందువాఁడు ♦ పసరము సుమతీ. 32

క॥ కవిగానివాని వ్రాఁతయు
నవరసభావములులేని ♦ నాతుల వలపుం
దవిలి చను పంది నేయని
వివిధాయుధకౌశలంబు ♦ వృథరా సుమతీ. 33

క॥ కాదుసుమీ దుస్సంగతి
పోదుసుమీ కీర్తికాంత ♦ పొందినపిదపన్
వాదుసుమీ యప్పిచ్చుట
లేదుసుమీ సతులవలపు ♦ లేశము సుమతీ. 34

క॥ కాముకుఁడు దనిసి విడిచిన
కోమలిఁ బరవిటుఁడు గవయఁ ♦ గోరుట యెల్లన్
బ్రేమమునఁ జెఱకుపిప్పికిఁ
జీమలు వెసఁమూఁగినట్లు ♦ సిద్ధము సుమతీ. 35

క॥ కారణము లేని నగవును
బేరణమును లేని లేమ ♦ పృథివీస్థలిలోఁ
బూరణము లేని బూరెయు
వీరణములు లేని పెండ్లి ♦ వృథరా సుమతీ. 36

క॥ కులకాంతతోడ నెప్పుడు
కలహింపకు, వట్టితప్పు ♦ ఘటియింపకుమీ
కలకంఠికంట కన్నీ
రొలికిన సిరి యింట నుండ♦నొల్లదు సుమతీ. 37

క॥ కూరిమిఁగల దినములలో
నేరము లెన్నఁడును గలుగ ♦ నేరవు; మఱి యా
కూరిమి విరసంబైనను
నేరములే తోఁచుచుండు ♦ నిక్కము సుమతీ. 38

క॥ కొంచెపునరుసంగతిచే
నంచితముగఁ గీడువచ్చు ♦ నది యె ట్లన్నన్
గించిత్తునల్లి కుట్టిన
మంచమునకుఁ జేటువచ్చు ♦ మహిలో సుమతీ. 39

క॥ కొక్కోక మెల్లఁ జదివినఁ
జక్కనివాఁ డైన రాజ♦చంద్రుండైనన్
మిక్కిలి రొక్కము లియ్యక
చిక్కదురా వారకాంత ♦ సిద్ధము సుమతీ. 40

క॥ కొఱగానికొడుకు పుట్టిన
కొఱగామియె కాదు తండ్రి ♦ గుణములఁ జెఱచున్
జెఱకుతుద వెన్ను పుట్టినఁ
జెఱకునఁ దీపెల్లఁ జెఱచు ♦ సిద్ధము సుమతీ. 41

క॥ కోమలి విశ్వాసంబును
బాములతోఁ జెలిమి యన్య♦భామలవలపున్

వేముల తియ్యదనంబును
భూమీశుల నమ్మికలును ♦ బొంకుర సుమతీ. 42

కII గడనఁగల మగని జూచిన
నడుగడుగున మడుఁగు లిడుదు ♦ రతివలు తమలో
గడ నుడుఁగు మగని జూచిన
నడుపీనుఁగు వచ్చె ననుచు ♦ నగుదురు సుమతీ. 43

కII చింతింపకు కడచినపని
కింతులు వలతు రని నమ్మ ♦ కెంతయు మదిలో
నంతఃపుర కాంతలతో
మంతనములు మాను మిదియె ♦ మతముర సుమతీ. 44

కII చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైన యట్లు ♦ పామరుఁడు దగన్
హేమంబుఁ గూడఁబెట్టిన
భూమీశులపాలఁ జేరు ♦ భువిలో సుమతీ. 45

కII చుట్టములుగానివారలు
చుట్టములము నీ కటంచు ♦ సొంపుఁ దలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబు గలుగఁ ♦ గదరా సుమతీ. 46

కII చేతులకుఁ దొడవు దానము,
భూతలనాథులకుఁ దొడవు ♦ బొంకమి, ధరలో
నీతియె తొడ వెవ్వారికి,
నాతికి మానంబుఁ దొడవు ♦ నయముగ సుమతీ. 47

క॥ తడ వోర్వక యొడ లోర్వక
కడువేగం బడచిపడిన ♦ గార్యం బగునే
తడ వోర్చిన నొడ లోర్చినఁ
జెడిపోయిన కార్యమెల్లఁ ♦ జేకుఱు సుమతీ. 48

క॥ తనకోపమె తనశత్రువు,
తనశాంతమె తనకు రక్ష, ♦ దయ చుట్టంబౌ,
తనసంతోషమె స్వర్గము,
తనదుఃఖమె నరక మండ్రు ♦ తథ్యము సుమతీ. 49

క॥ తనయూరి తపసితనమును
తనపుత్త్రుని విద్యపెంపుఁ ♦ దనసతిరూపున్
దనపెరటిచెట్టుమందును
మనసున వర్ణింప రెట్టి♦మనుజులు సుమతీ. 50

క॥ తనకలిమి యింద్రభోగము
తనలేమియె సర్వలోక♦దారిద్ర్యంబున్
దనచావు జగత్ప్రళయము
తనువలచినయదియె రంభ ♦ తథ్యము సుమతీ. 51

క॥ తనవారు లేనిచోటను
జనవించుక లేనిచోట ♦ జగడముచోటన్
అనుమానమైనచోటను
మనుజునకును నిలువఁదగదు ♦ మహిలో సుమతీ. 52

క॥ తములము సేయని నోరును
విమతులతోఁ జెలిమిసేసి ♦ వెతఁబడు తెలివిన్

గమలములు లేని కొలఁకును
హిమధాముఁడు లేనిరాత్రి ♦ హీనము సుమతీ. 53

క॥ తలనుండు విషము ఫణికిని,
వెలయంగాఁ దోఁకనుండు ♦ వృశ్చికమునకున్,
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము ♦ గదరా సుమతీ. 54

క॥ తలపొడుగు ధనముపోసిన
వెలయాలికి నిజములేదు; ♦ వివరింపంగాఁ
దలఁదడివి బాసఁజేసిన
వెలయాలిని నమ్మరాదు ♦ వినురా సుమతీ. 55

క॥ తలమాసిన నొలుమాసిన
వలువలు మాసినను బ్రాణ♦వల్లభునైనన్
గులకాంతలైన రోఁతురు
తిలకింపఁగ భూమిలోనఁ ♦ దిరముగ సుమతీ. 56

క॥ తాను భుజింపని యర్థము
మానవపతిఁ జేరుఁ గొంత, ♦ మఱి భూగతమౌఁ
గానల నీగలుగూర్చిన
తేనియ యొరుఁ జేరుపట్లు ♦ తిరముగ సుమతీ. 57

క॥ దగ్గఱ కొండెము సెప్పెడు
ప్రెగ్గడపలుకులను రాజు ♦ ప్రియుఁడై మఱి తా
నెగ్గుఁ బ్రజ కాచరించుట
బొగ్గులకై కల్పతరువుఁ ♦ బొడుచుట సుమతీ. 58

క॥ ధనపతిసఖుఁడై యుండియు
నెనయంగా శివుఁడు భిక్ష♦మెత్తఁగ వలసెన్
దనవారి కెంతఁ గలిగినఁ
దనభాగ్యమె తనకుఁగాక ♦ తథ్యము సుమతీ. 59

క॥ ధీరులకుఁ జేయు మే లది
సారంబగు నారికేళ♦సలిలముభంగిన్
గారవమును మఱి మీఁదట
భూరిసుఖావహము నగును ♦ భువిలో సుమతీ. 60

క॥ నడవకుమీ తెరు వొక్కటఁ
గుడువకుమీ శత్రునింటఁ ♦ గూరిమితోడన్
ముడువకుమీ పరధనముల
నుడువకుమీ యొరులమనసు ♦ నొవ్వఁగ సుమతీ. 61

క॥ నమ్మకు సుంకరి జూదరి
నమ్మకు మగసాలిసాని ♦ నటు వెలయాలిన్
నమ్మకు మంగడివానిని
నమ్మకుమీ వామహస్తు ♦ నవనిని సుమతీ. 62

క॥ నయమునఁ బాలుం ద్రావరు
భయమునను విషమ్మునైన ♦ భక్షింతురుగా!
నయ మెంతదోసకారియొ !
భయమే చూపంగవలయు ♦ బాగుగ సుమతీ. 63

క॥ నరపతులు మేరఁదప్పినఁ,
దిర మొప్పఁగ విధవ యింటఁ ♦ దీర్పరియైనన్,

గరణము వైదికుఁ డైనను
మరణాంతక మౌనుఁగాని ♦ మానదు సుమతీ. 64

క॥ నవరసభావాలంకృత
కవితాగోష్ఠియును మధుర♦గానంబును దా
నవివేకి కెంతఁ జెప్పినఁ
జెవిటికి సం కూఁదినట్లు ♦ సిద్ధము సుమతీ. 65

క॥ నవ్వకుమీ సభలోపల
నవ్వకుమీ తల్లిదండ్రి ♦ నాథులతోడన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల ♦ నయ మిది సుమతీ. 66

క॥ నీరే ప్రాణాధారము
నోరే రసభరితమైన ♦ నుడువుల కెల్లన్
నారియె నరులకు రత్నము
చీరయె శృంగార మందు ♦ సిద్ధము సుమతీ. 67

క॥ పగ వల దెవ్వరితోడను
వగవంగా వలదు లేమి♦వచ్చిన పిదపన్
దెగనాడవలదు సభలను
మగువకు మన సియ్యవలదు ♦ మహిలో సుమతీ. 68

క॥ పతికడకుఁ దన్నుఁ గూర్చిన
సతికడకును వేల్పుకడకు ♦ సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతి♦మార్గము సుమతీ. 69

క॥ పని చేయునెడల దాసియు,
ననుభవమున రంభ, మంత్రి • యాలోచనలన్,
దన భుక్తియెడలఁ దల్లియు
ననఁ దనకులకాంత యుండ • నగురా సుమతీ. 70

క॥ పరనారీసోదరుఁడై
పరధనముల కాసపడక • పరులకు హితుఁడై
పరులు దను బొగడ నిగుడక
పరు లలిగిన నలుగనతఁడు • పరముఁడు సుమతీ. 71

క॥ పరసతికూటమిఁ గోరకు
పరధనముల కాసపడకు • పరు నెంచకుమీ
సరిగాని గోష్ఠిసేయకు
సిరిచెడి చుట్టంబుకడకుఁ • జేరకు సుమతీ. 72

క॥ పరసతులగోష్ఠినుండిన
పురుషుఁడు గాంగేయుఁడైన • భువి నిందపడున్
బరసతి సుశీలయైనను
బరుసంగతి నున్న నింద•పాలగు సుమతీ. 73

క॥ ఒరు నాత్మఁ దలఁచు సతి విడు
మఱుమాటలు పలుకు సుతుల • మన్నింపకుమీ
వెఱ పెఱుఁగని భటు నేలకు
తఱచుఁగ సతిఁ గవయఁబోకు • తగదుర సుమతీ. 74

క॥ పరుల కనిష్టము సెప్పకు
పొరుగిండ్లకుఁ బనులులేక • పోవకు మెపుడున్

బరుఁ గదిసిన సతిఁ గవయకు
మెఱిఁగియుఁ బిరుసైనహయము ♦ నెక్కకు సుమతీ. 75

క॥ పర్వముల సతులఁ గవయకు
ముర్వీశ్వరుకరుణ నమ్మి ♦ యుబ్బకు మదిలో
గర్వింప నాలిఁ బెంపకు
నిర్వాహణము లేనిచోట ♦ నిలువకు సుమతీ. 76

క॥ పలు దోమిసేయు విడియము
తలఁగడిగిననాఁటి నిద్ర ♦ తరుణులయెడలన్
బొలయలుకనాఁటికూటమి
వెల యింతని చెప్పరాదు ♦ వినురా సుమతీ. 77

క॥ పాటెఱుఁగని పతి కొలువును
గూటంబున కెఱుకపడని ♦ కోమలి రతియున్
బేటెత్తఁజేయు చెలిమియు
నేటికి నెదు రీఁదినట్టు ♦ లెన్నఁగ సుమతీ. 78

క॥ పాలను గలసిన జలమును
బాలవిధంబుననె యుండుఁ; ♦ బరికింపంగాఁ
బాలచవిఁ జెఱచుఁ గావునఁ
బాలసుఁ డగువానిపొందుఁ ♦ వలదుర సుమతీ. 79

క॥ పాలసునకైన యాపద
జాలింబడి తీర్పఁదగదు ♦ సర్వజ్ఞునకున్
దే లగ్నిఁ బడఁగఁ బట్టిన
మే లెఱుఁగునె మీఁటుగాక ♦ మేదిని సుమతీ. 80

క॥ పిలువని పనులకుఁ బోవుట,
గలయని సతిరతియు, రాజు ♦ గానని కొలువున్,
బిలువని పేరంటంబును,
వలవని చెలిమియును జేయ♦వలదుర సుమతీ. 81

క॥ పురికిని బ్రాణము కోమటి
వరికిని బ్రాణంబు నీరు ♦ వసుమతిలోనన్
గరికిని బ్రాణము తొండము
సిరికిని బ్రాణంబు మగువ ♦ సిద్ధము సుమతీ. 82

క॥ పులిపాలు దెచ్చియిచ్చిన
నలవడఁగా గుండెఁ గోసి ♦ యఱచే నిడినన్
దలపొడుగు ధనముఁ బోసిన
వెలయాలికిఁ గూర్మిలేదు ♦ వినురా సుమతీ. 83

క॥ పెట్టిన దినములలోపల
నట్టడవులకైన వచ్చు ♦ నానార్థములున్
బెట్టని దినములఁ గనకఁపు
గట్టెక్కిన నేమిలేదు ♦ గదరా సుమతీ. 84

క॥ పొరుగునఁ బగవాఁ డుండిన
నిర వొందగ వ్రాఁతకాఁడె ♦ యేలికయైనన్
ధరఁ గాపు కొండెమాడినఁ
గరణాలకు బ్రతుకులేదు ♦ గదరా సుమతీ. 85

క॥ బంగారు కుదువఁబెట్టకు
సంగరమునఁ బాఱిపోకు ♦ సరసుఁడవైతే

నంగడి వెచ్చము లాడకు
వెంగలితోఁ జెలిమి వలదు ♦ వినురా సుమతీ. 86

క॥ బలవంతుఁడ నా కేమని
పలువురతో నిగ్రహించి ♦ పలుకుట మేలా!
బలవంతమైన సర్పము
చలిచీమలచేతఁ జిక్కి ♦ చావదె సుమతీ. 87

క॥ మండలపతిసముఖంబున
మెండైన ప్రధానిలేక ♦ మెలఁగుట యెల్లన్
గొండంత మదపుటేనుఁగు
తొండము లేకుండినట్లు ♦ తోఁచుర సుమతీ. 88

క॥ మంత్రిగలవానిరాజ్యము
తంత్రము సెడకుండ నిలుచుఁ ♦ దఱచుగ ధరలో
మంత్రివిహీనునిరాజ్యము
జంత్రపుఁ గీ లూడినట్లు ♦ జరుగదు సుమతీ. 89

క॥ మాటకుఁ బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభట♦కోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు ♦ సిద్ధము సుమతీ. 90

క॥ మానఘనుఁ డాత్మధృతి సెడి
హీనుండగువాని నాశ్ర♦యించుట యెల్లన్
మానెడు జలములలోపల
నేనుఁగు మెయి దాఁచినట్టు ♦ లెఱుఁగుము సుమతీ. 91

క॥ రా పొమ్మని పిలువని యా
భూపాలుని గొల్వ భుక్తి•ముక్తులు గలవే!
దీపంబు లేని యింటను
జేపున కీళ్ళాడినట్లు • సిద్ధము సుమతీ. 92

క॥ రూపించి పలికి బొంకకు
ప్రాపగు చుట్టంబు నెగ్గు•పలుకకు మదిలోఁ
గోపించు రాజుఁ గొల్వకు
పాపపు దేశంబు సొరకు • పదిలము సుమతీ. 93

క॥ లావుగలవానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు • బలవంతుండౌ
గ్రావం బంత గజంబును
మావటివాఁ డెక్కినట్లు • మహిలో సుమతీ. 94

క॥ వఱదైన చేను దున్నకు
కఱవైనను బంధుజనుల•కడ కేఁగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళవాయితనముఁ • బెట్టకు సుమతీ. 95

క॥ వరిపంట లేని యూరును
దొర యుండని యూరు తోడు•దొరకని తెరువున్
ధరను బతిలేని గృహమును
నరయంగా రుద్రభూమి • యనఁదగు సుమతీ. 96

క॥ వినఁదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక • వివరింపఁ దగున్

గని కల్ల నిజము దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు ♦ మహిలో సుమతీ. 97

క॥ పీడెము సేయని నోరును
జేడెల యధరామృతము రు♦చింపని నోరుం
బాడంగరానినోరును
బూడిద కిరవైన పాడు♦బొందర సుమతీ. 98

క॥ వెలయాలివలనఁ గూరిమి
గలుగదు; మఱిఁ గలిగెనేని ♦ కడతేరదుగాఁ
బలువురు నడిచెడు తెరువునఁ
బులు మొలవదు మొలిచెనేనిఁ ♦ బొదలదు సుమతీ. 99

క॥ శుభముల నొందని చదువును
నభినయమును రాగరసము ♦ నందని పాటల్
గుభగుభలు లేని కూటమి
సభ మెచ్చని మాటలెల్లఁ ♦ జప్పన సుమతీ. 100

క॥ సరసము విరసముకొఱకే
పరిపూర్ణసుఖంబు లధిక♦బాధలకొఱకే
పెఱుఁగుట విఱుగుటకొఱకే
ధర తగ్గుట హెచ్చుకొఱకె ♦ తథ్యము సుమతీ. 101

క॥ మే లెంచని మాలిన్యుని,
మాలను, నగసాలవాని, ♦ మంగలి హితుఁగా
నేలిన నరపతిరాజ్యము
నేలఁ గలసిపోవుఁ గాని ♦ నెగడదు సుమతీ. 102

క॥ స్త్రీలయెడ వాదులాడకు
బాలురతోఁ జెలిమి సేసి ♦ భాషింపకుమీ

మేలైన గుణము విడువకు
మేలినపతి నిందసేయ ♦ కెన్నఁడు సుమతీ. 103

క॥ సిరి దా వచ్చిన వచ్చును
సరళముగ నారికేళ♦సలిలముభంగిన్
సిరి దాఁ బోయినఁ బోవును
కరిమ్రింగిన వెలగపండు♦కరణిని సుమతీ. 104

క॥ మది నొకని వలచియుండఁగ
మదిచెడి యొకకూ్రరవిటుఁడు ♦ మానక తిరుగన్;
అది చిలుక పిల్లి పట్టినఁ
జదువున యా పంజరమున ♦ జగతిని సుమతీ. 105

క॥ పుత్రోత్సాహము తండ్రికి
బుత్రుఁడు జన్మించినపుడె ♦ పుట్టదు; జను లా
పుత్రునిఁ గనుగొని పొగడఁగ
బుత్రోత్సాహంబు నాఁడు ♦ పొందుర సుమతీ. 106

క॥ వెలయాలు సేయుబాసలు,
వెలయఁగ నగసాలిపొందు, ♦ వెలమలచెలిమిం,
గలలోనఁ గన్న కలిమియు
విలసితముగ నమ్మరాదు ♦ వినురా సుమతీ. 107

క॥ వేసరఁపుజాతికానీ,
వీసము తాఁ జేయనట్టి ♦ వ్యర్థుఁడుగానీ,
దాసికొడుకైనఁ గానీ
కాసులుగలవాఁడె రాజు ♦ గదరా సుమతీ. 108



